# పుష్పవేణీ నాటకము.

ఇందలి కథాసరళి అత్యద్భుతము. మహాపతివ్రతయగు పుష్పవేణి వరించిన సుప్రకాశుఁడు ఆమెను నిరాకరించి యడవికిఁబోయి సర్పదష్టుఁడై మూర్ఛిల్లియుండఁగా శోకించుచువచ్చి సహగమనముచేయసాహసించుట ఆశ్చర్యవిషాదకరము. దొంగల వికటఁపుమాటలును పాటలును కడుపుచెక్కలగునట్లు నవ్వించును. వెల రు. ౦—౧౦—౦.

# వీరమతీ నాటకము.

జామ్ములో పదునొకండుగురు వీరులనుజంపిన రాజపుత్రస్త్రీచరిత్రము. వీరరసభరితమై యుద్రేకము గలిగించును. దేశభక్తి, స్వార్థత్యాగము, స్త్రీసాహసము ఇందేచూడవలయును. వెల రు ౦—౧౦—౦.

# గురుదక్షిణ

## ఏకలవ్యుఁడు.

విజనమై విశాలమైన వనమునం దొక యువకే

నభ్యసించుచుండెను. అతఁడు నల్లనై పొడుగై బలిష్ఠమైన యాకారమును, వజ్రకర్కశమగు వెడఁదయురమును, నారికాయలుగల నిడుద బాహువులును, నిగుబుజములును, సన్న నడుమును, గలిగి యొప్పుచుండెను. ఆతని ఫాలము విశాలమై క్షాత్రతేజమున కాలవాలమై యుండెను. కన్నులు వికాసవంతములై వీనులఁ దాకుచుండెను. నూనూగు మీసము లాతని నవ యౌవనావిర్భావమును ప్రకటించుచుండెను. మూ

పులలో సూక్ష్మబుద్ధియుఁ బట్టుదలయు సూచితములగుచుండెను. ఈల క్షణములం బట్టి యాతఁడొక శాక్తోమరుండనియు, ధనుర్విద్యా ధురంధరుండనియు సులభముగా నూహించుకొనవచ్చును. కాని యాతని గంతు మొగమును, నించుక బొద్దు పెదవులును, చర్మాంబరములును మీఁదను మిక్కిలి వనావాసమును నాతఁడొక యనాగరక జన్ముఁడని చెప్పక చెప్పుచుండెను. అతఁడు భుజమున నంబుల పొదిధరించి, నారి సారించుచు, శరములు సంధించుచు, నేల నీడనుజూచి నింగి నెగసెడు పక్షుల నొక్కొక్క కోలనే కూలనేయుచు వినోదించుచుండెను. ఇంతలోఁ గూతవేటు దూరమునుండి యేదో మృగధ్వనివలె శబ్దము వినవచ్చెను. ఆ శబ్దము విస్పష్టముగా లేదు. వృక్షముల మర్మరరవముతో మిళితమై వచ్చెను. అది యేమూలనుండి వెలువడెనో మనకు సరిగా గురింపఁజాలము.



కాని యా తరుణుఁడు తటుక్కున దొననుండి యేడు వాఁడి యలుగులు దీసి నారిం గూర్చి చెవిదాక లాగి గుఱిచూచి యా యలుకుఁడు వచ్చిన వైపున కొక్క పరిగాఁ బఱపెను. అలుగుల వడి యలుకుఁడు వడిని మించెను. పక్షి యీకలు గట్టిన యా బాణములు పంతములు వేసికొనిన పక్షులవలె రివ్వున నెగిరిపోయెను. అవి గుఱిని నాటెనో యేమో కాని యొక క్షుద్ర జంతువు కూయి రెంపుమారులు గాలితోఁ గలసి వచ్చి వీనులం జొచ్చెను.

ఆశ్చర్యము! ఒక్క పట్టున నేడమ్ములు! సవ్యసాచియైన యర్జునునకైన, ధనురాచార్యుఁడగు ద్రోణునకైన నసాధ్యమైన యీ నైపుణ్య మీ యాటవికుని కెట్లు లభించినది? ఈతని గురుఁడెవ్వఁడు? ఈతని వృత్తాంత మెయ్యది? బాలకులారా? ఆలకింపుఁడు. ఈతఁడొక

యెఱుకు రాజకుమారుఁడు. తండ్రిపేరు హిరణ్యధన్వుఁడు. ఈతని పేరేక లవ్యుఁడు. ఏకలవ్యునకు శైశవము నుండియు విలువిద్యయం దభిమానము మెండు. అప్పటికి ధనుర్ధరులలో నగ్రేసరుండని పేరు మోసిన ద్రోణాచార్యుఁడు హస్తినాపురంబునఁ గౌరవపాండవులకును నితర రాజపుత్రులకును గోదండ పాండిత్యమును గఱపుచుండెను. ఆ బాలుఁడా ప్రసిద్ధిని విని యాయన యనుగ్రహమున శరకౌశలమును సంపాదింపఁ దలంచి యొక్కనాఁ డాయన సన్నిధి కరిగి యాయనకుఁ దన్నుఁ దెలిపికొనుచు దండ ప్రణామంబు లాచరించి వినయ వినమితాంగుఁడై కరములు దోయిలించి తన యభీష్టమును విన్నవించి తన్ను ధన్వునిఁ జేయఁ గోరెను. కాని యేకలవ్యుఁడు నిషాదపుత్రుఁడగుటచే భారద్వాజుఁడు వానిని శిష్యునిఁగా నంగీకరించుటకు నిరాకరించెను. ఎఱుకు బాలుఁడు భగ్న మనో



రథుఁడై నిరుత్సాహుఁడై నిర్వేగపాటు నొందెను. తన దురదృష్టమునకుఁ దన్నుఁ దా నిందించుకొనెను. తన జీవిత మింక నిష్ఫల మని తలపోసెను. అయ్యో! తన కులమే తన విద్యకు విఘ్నమాయెను. ఇఁక నతఁడేమి చేయఁగలఁడు? పాపము! ఖిన్నుఁడై చిన్నఁబోయిన మొగముతో ద్రోణుని కడ సెలవుఁగొని తన భావి దశను గూర్చి చింతించుచు నింటికి మరలెను.

మరలినను విలువిద్యయందలి కోరిక మాత్ర మాతని మనసు నుండి మరలలేదు. దానిని నేర్చుకొనుట యందలి యుత్సాహ మణఁగ లేదు. ఆతఁ డభిమాన ధనుఁడును, దీక్షాపరుఁడు నగుటచే నెట్లైనను ధనుర్విద్యను సాధించి తీరవలయు నని నిశ్చయించుకొనెను. కోరికయున్నచో

దారి దొరుకక పోవునా ! ద్రోణుఁడు తన్ను నిరాకరించినను విలువిద్యను నేర్పుటలో నంతవాఁడు లేఁడని వినియున్నవాఁడు కావున నేకలవ్యుని కాయనయందు భక్తి తగ్గక యిమ్మడి ముమ్మడిగా నధికమయ్యెను. కోదండ పాణి యైన ద్రోణుని రూపమున నొక్క చక్కని మట్టి బొమ్మను నిర్మించి, యా విగ్రహమునే గురువుగా భావించుకొని, నిత్యమును భక్తి శ్రద్ధలతోఁ బూజించుచు, దాని నెదుర నుంచుకొని ధనుర్విద్యాభ్యాసమును జేయుచుండెను. అతఁడనుదినమును నుదయమున సాయంతనమున నాప్రతిమకు సాష్టాంగ నమస్కారములు చేయక చాప విద్యాసాధనమున కుపక్రమింపఁడు. ఒకసారి లక్ష్యము తప్పినతోఁ దోడనే యా విగ్రహమునకుఁ బ్రదక్షిణములుచేసి ప్రణామము లాచరించి ప్రార్థించి మరల వచ్చి గట్టి పట్టుదలతో గుఱి తప్పక కొట్టి తీరును. ఇట్లు సాధనము చేయుచు



జవ్వనము నిండునాఁటి కేకలవ్యుఁడు కోదండ విద్యయం దుద్దండ పండితుండయ్యెను.

ఆయువకుఁ డిప్పుడు బహుదూర పదార్థములనైన, మేఘ మండలమున నెగురుచు గిఱ్ఱున దిరుగు పక్షులనైన, నున్నత గిరి శిఖరముల నున్న మహావృక్షాగ్రశాఖల వాయు సంచలితములై యల్లలనాడు పల్లవములనైన నొక్క యేటున నేయుట; బారు తీరియున్న యైదారు చెట్టుల నొక్క బాణంబున భేదించుట; వరుసలుగాఁ గాక విసుమానములుగా నున్న యేడెనిమిది తరువుల నొక్క వాఁడి యమ్ముచేఁ గూల నేయుట; వాఁడి గల బాణ మయ్యును, విద్యుద్వేగమున విసురఁబడినదయ్యును, లక్ష్యవస్తువులను భేదింపక చుంబించినట్లు స్పృశింపనేయుట; మింటికి నైచిన కందుకమును శరపరంపరచేఁ బంజరము నిర్మించి క్రిందఁ

బడక్కుండ నిలుపుట ; నీటిలోని పదార్థములను నీడఁజూచి బాణప్రయోగమునఁ బైకి దీయుట ; అగ్రిగామిగా విడిచిన కాండము పుడమిం బడులోపలఁ గొండొక కాండము దాని పుంఖంబున నాటించి యిట్లు పుంఖానుపుంఖములుగా విడిచిన కాండ ప్రకాండములచే దిశామానదండంబులో యన నతి దీర్ఘ బాణదండంబులఁ గల్పించుట ; రివ్వున నిలువున నెగిరిన నారసము జవ్వున వంగి నిర్దిష్ట ప్రదేశమున వాలునట్లేయుట ; సూటిగా వదలిన ప్రదరము ధనుర్ధరునిఁ బ్రదక్షిణించి యగ్రిగామిగా నేగఁ జేయుట ; ఏడెనిమిది, పది పండ్రెండు వాలుఁగోలల నొక్కపట్టున వేయుట ; ఆకసమున నతి దూరమున మిలమిల మెదలెడు కీలుచేపలు, గిరగిరఁ దిరిగెడు మరబొమ్మలు నిర్మించి యద్దములయందును, జలములయందును, నతి సూక్ష్మ రూపములఁ దోఁచు వాని నీడలను జూచి గుఱితప్పక



కొట్టు నేర్పునఁ జూపుట ; ఖగమృగాదుల ధ్వని వినినంతనే వాని యున్న తావుల గ్రహించి యొక్క వేటుననే వానిఁ గూల్చుట ; ముష్టిగ సత్యద్భుత ప్రయోగములను సాధించి కుడియెడమ చేతుల సమరీతుల నేయుటయే గాక పదలాఘవమునఁ గూడ నిపుణులు చేయు సమర్ధుఁడై యసమాన ధానుష్కుఁడై యలరుచుండెను. ఆ తరుణుఁడు తన యప్రతిమ ప్రతిభా ప్రభావముచేతను, ననవరత పరిశ్రమ నిరతిచేతను నతికాలముననే యింతటి కార్ముక కళా కుశలుఁడయ్యెను. చాపవిద్యా మహారణ్యమున నతనికి పోవని త్రోవలు లేవు. చూడని జాడలు లేవు. అతని సునిశిత మేధా సంపద కసాధ్యములు లేవు. ఆహా ప్రపంచమునఁ దోఁచిన చాయలెల్ల నచిరముగనే స్వాయత్తములుగఁ జేయుచుండెను. ఆవిలుకాఁడు బాణ సాధనము చేయునప్పుడు విలువంచుట, యమ్ముల

యుట, తొడుగుట, వేయుట గానరాక నారి మ్రోఁతయు, ధారాపాత ములవలె నెడతెగక పడెడు శరాసారమును మాత్రము గాన వచ్చుచుం డెను. శర సాధనమున నతఁడు చూపెడు సుతారమును, జాకచక్యమును, నైపుణ్యమును ననన్యసామాన్యములు. ఏకలవ్యుఁడిట్లు సహజ ధనుర్వేద పాండిత్యుండయ్యును నవ్విద్య విస్మృతిం బొరయకుండ నశ్రాంతపరిశ్ర ముఁడై జితశ్రముఁడై తేజరిల్లుచుండెను.

౨

పాండవ కౌరవ రాజకుమారు లొకనాఁడు వన మృగముల వేఁటాడ వేడుకపడుటచే ద్రోణుఁడు వారి యుత్సాహమును దీర్చుకొన ననుజ్ఞ నొసంగెను. రాజపుత్రులు మృగయా విహారమున కుచితములైన వేషములు దాల్చి యశ్వముల నెక్కి జవసత్త్వసంపన్నములగు సారమే



యములను; నురులుఁ, జిక్కములుఁ బగ్గములు, నీఁటెలు, బల్లెములు, విండ్లుఁ, గోలలు మున్నగు పరికరములను గొని భటసమూహములు సంద డింప నరణ్యమున కరిగిరి. రాకొమరులు తమతమ ధైర్యసాహసములును, ధనుర్విద్యా పాటవములును దేటపడ నొకరిని మించి యొకరు వనమృగ ముల వేఁటాడుచుండిరి. కౌంతేయ మధ్యముఁడగు భీమసేనుఁడు మహా బలుఁడగుటచే బెబ్బులుల నొక్కొక్క ముష్టి దెబ్బచే నష్టపరచియు, నేనుంగులఁ దొండంబులం బట్టి గండంబులఁ బగుల గ్రుద్ది పీనుంగులఁ జేసియు, ఖడ్గంబుల ఖడ్గంబు వ్రేటుల ఖండించియు, భల్లూకంబుల కొక్కొక్క చెంపపెట్టుననే యమలోకంబునుజూపియు, సింహవ్రాతంబుల గదాఘాతంబులచే మృత్యువు వాతం బడఁజేసియు నీవిధంబుగా నత్య ద్భుతంబుగాఁ గ్రూరమృగ సంహారంబు చేయుచుండెను. కార్ముక కళో

విలువిద్య నెవ్వరి చేత నేర్చితిరి?

ధనురాచార్యుఁ డగు ద్రోణాచార్యుని యనుగ్రహముచేత.

అర్జునుని యంతరంగమున నసూయ పెచ్చు పెరుగఁజొచ్చెను. కాని దానియుద్రేకమును దోఁపనీయక లోలోపల నడంచుకొని అయ్యా! మీ శరలాఘవంబునకు మెచ్చు వచ్చి మిమ్ముఁ జూచిపోవచ్చితిమి. ఆచార్యుఁ డగు ద్రోణుని శిష్యుఁడవగుటచే మాకుఁ బరమాప్తుఁడవు. నీవంటి వింటి నేర్పరి సతీర్థుఁడగుట మాకుఁ బరమానందము. అనిచెప్పి యతనిని గొని యాడెను. పిమ్మట రాజకుమారు లెల్లరును నిజపురమ్మున కరుగుదెంచిరి.

3

ఒకనాఁడు ద్రోణుఁ డేకాంతముననుండఁగా నర్జునుం డచ్చటికి వచ్చెను. అప్పు డుభయులకును నీవిధమున సంభాషణము జరిగెను.



ద్రోణాచార్యుఁడు వత్సా! నీవు మాకు శిష్యుఁడనని చెప్పితివి. అది యెట్టులో వివరింపుమని యడిగెను. నిషాదపుత్రుఁడు తానుమున్ను ధనుర్విద్యాగ్రహణార్థియై గురుసన్నిధానమ్మున కరుగుదెంచుట స్మృతికిం దెచ్చి పదంపడి తాను విద్యనేర్చినచందంబంతయు విన్నవించి యాతని నాశ్చర్యభరితాంతరంగునిఁ గావించెను. విజయుండు విస్మయహృదయుం డయ్యెను. ఎఱుకవాని పట్టుదలకును నేర్పునకును నానందము నందుటకు బదులుగా నతని బాణవిద్యాపరిణతికిఁ దేజోబలములకును నరుండు మరింత యసూయాపరుండై యాచార్యునివంకఁ జూచెను. ద్రోణుండతని మొగముం గనుంగొని మనసును దెలిసికొనియెను. అంతట భారద్వాజుఁడు నిషాదతనూజునిఁ జూచి నీ విద్యాదీక్షకును గురుభక్తికిని బరమానందము నొందితిమి. ప్రియశిష్యుఁడైన నీవలనఁ దగిన గురుదక్షిణఁ బడయ నభి

లక్షించుచున్నాఁడనని నుడివెను. గురుని వచనంబులకుఁ బరమహర్షంబున నుప్పొంగి యా యెఱుకుతేని కొడుకు స్వామీ! ఇదిగో దేహము! ఇదిగో ధనము! ఇదె నాపరివారము! వీనిలో దేవరయభీష్ట మెయ్యదియో దా నిని సమర్పించుచున్నాఁడను. కావున ననుగ్రహించి యభీష్టార్థంబు స్వీక రింపఁ బ్రార్థించుచున్నాఁడను. అని విన్నవించెను. అంత ద్రోణుఁడు వత్సా! నీ కుడిచేతి పెనువ్రేలు దునిమి దక్షిణగా నర్పింపుము. ఇది య మదీయాభీష్టము. అని వక్కాణించెను. గురుభక్తుఁడు ఏకలవ్యుఁడు చిరకాలమోపార్జితమగు తన శరవిద్యయెల్ల దానితో నిష్ప్రయోజనమగుట నెఱింగియు నిశ్శంక మానసముతో ధన్యుఁడను! ధన్యుఁడ! ననుచు నానం దవీచికల నోలలాడుచు గురుని మనోరథసిద్ధినిఁ గావించి చరితార్థుఁ డయ్యెను. పార్థుని మనోభరము తీఱి[illegible]ను.

# నిరుద్ధ భారతము

భారతము పంచమవేదము. నిరుద్ధభారతము పంచమవేదమే. (పంచములకు వేదమువంటిది.) ఇందు మాల, మాదిగలపుట్టుగడ, చండాలాది నీచనామములు కలుగుటకు కారణములు, ఆజాతులలో పుట్టిన మహాభక్తులు, మహాకవులు మహావీరులు, మహారాజులు, మహాముసులు, మహాపతివ్రతలు అగ్రజాతులతోఁ గల సంబంధము, ధర్మశాస్త్ర, పురాణ, చరిత్రాదులనుండి అనేకప్రమాణములతో వివరింపఁబడినవి. నిమ్నజాతు లనుభవించుకష్టములు వర్ణించినఘట్టమునఁగాని మొట్టమొట్ట కొన్నపట్టునఁగాని ఒక్కపద్యమైన చదివినను విన్నను కటికవానికైన కనికర ము కలుగకమానదు.

వెల రు ౦—౮—౦

| | | |
|---|---|---|
| ౪ | బాలవితంతువిలాపము, జాలిపద్యములు. | ౦—౪—౦ |
| ౫ | సరసరసాయనము, కోకిల మొదలగువానిపై చక్కనిపద్యములు. | ౦—౪—౦ |
| ౬ | చమత్కారచంద్రిక, చిత్రవిచిత్రపద్యములు. | ౦—౮—౦ |
| ౭ | పద్మవ్యూహము, అభిమన్యుయుద్ధము | ౦—౩—౦ |
| ౮ | రాజలేఖ. } చక్కనినీతికథలు. | ౦—౩—౦ |
| | లలిత. } చక్కనినీతికథలు. | ౦—౩—౦ |
| | ద్రౌపది. } చక్కనినీతికథలు. | ౦—౩—౦ |
| ౯ | లీలావతి—ప్రహ్లాదునితల్లిచరిత్ర. | ౦—౧—౬ |
| ౧౦ | భారతమాతృశతకము, భక్తిరసభరితము. | ౦—౧—౬ |

మంగిపూడి వేంకటశర్మ,

పిప్పర్ర, కృష్ణాజిల్లా.

